

# కబీర్‌దాసు "దోహాలు"

## ఆంధ్రానువాదము

## (తెలుగు పద్యములు తాత్పర్యంతో)

రచన


అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు

M.Tech.



## సతీ సమేత అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు


Address :

Flat No.5; Plot 61,

Siddardha Apartments,

Siddardha Nagar,

Hyderabad - 500 038, A.P, India

E-Mail : deekshitulu_a@yhaoo.com

Mobile : 9393021360

Website: http://www.geetadeeksha.com/

శుభమస్తు    అవిఘ్నమస్తు



# కబీర్‌దాసు "దోహాలు"

**ఆంధ్రానువాదము**

**(తెలుగు పద్యములు తాత్పర్యంతో)**

**రచన**

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.



## ముందుమాట

ఉత్తర భారతదేశంలో వెలసిన ఉత్తమోత్తమ భాగవతులలో ఒకరైన కబీరుదాసు గారి గురించి నాకు తెలిసింది అత్యల్పమే. అయినా వేరొక ధర్మాన్ని (మతధర్మం) అనుసరిస్తూ "సర్వధర్మపరిత్యజ్య...' అన్న గీతాచార్యుని వాక్యాన్ని కూలంకషంగా అర్థం చేసుకున్న మహానుభావుడు కబీరు. మతం మనస్సుకు, వేషం శరీరానికి, దైవం ఆత్మకే కావలసిన ఆలంబనాలు. వెండితో చేసిన పీటనైనా మట్టిగోడకానించవలసిందే. రాజాధిరాజైనా మట్టిలో కలవాలిసిందే. ఏమతం వాడైనా మనస్సును నిరోధించ వలసిందే. ఏనాటికైనా జీవాత్మ పరమాత్మను చేరవలసిందే. తప్పదు. అది ఎన్నాళ్ళకు, ఎన్ని



జన్మలకు అన్నది తెలిసేది ఆ భగవంతుడికే. మహమ్మదీయునిగా జీవించిన కబీరుగాని, క్రైస్తవ సన్యాసినిగా జీవించిన మదర్‌థెరీసా గాని, సిక్కుమత స్థాపకుడు గురునానక్ గాని, బౌద్ధధర్మం బోధించిన బుద్ధ భగవానుడు గాని, మానవత్వమే భగవదారాధన అన్నారు. ఆ మహామహులు చెప్పిన మంచిలో ఇసుకరేణు వంత మంచిని అవలంభించినా మంచిదే. సాయిబాబా భగవదవతారం అనేవారు ఆయనలో పరబ్రహ్మను చూస్తారు. ఆపరబ్రహ్మ ముస్లిం అనలేం, హిందు వనలేం. ఆయనెవరంటే 'దేవుడు' అంటాం. అలాగే కబీరు ముస్లిం అనటం ఆకాశం నీలంగా ఉన్నదనటంలాంటిది. నిజానికి 'ఆకాశం గగనం శూన్యం' అంతేకదా! అలాగే కబీరు ఒక దివ్యాత్మ. అది ముస్లింలా జీవించి మనబోటి సామాన్యులకు



జీవితకాలమంతా ధర్మం, జ్ఞానం, భక్తి యొక్క త్రివేణీ సంగమంలో స్నానం చేసే పుణ్యం కలిగించాడు.

ఆయన రచించిన దోహాలను నా సన్మిత్రులు శ్రీఅన్నపురెడ్డి కృష్ణారెడ్డి గారి ద్వారా విని ఆకర్షితుడనై నేను నేర్చింది నలుగురికీ చెప్పాలనే తపన కలిగిన వాడినవడం చేత, నేడు మీలాంటి భక్తులకు చెప్పగలుగుతున్నాను.

పద్యరచన నా కత్యంత ప్రీతి పాత్రం గనుక 'వేమన'గారి స్ఫూర్తితో ఆటవెలది పద్యం మీద నాకున్న ఇష్టంతో కబీరు దోహాలను ఆటవెలదుల లోకి మార్చాను. గత అనుభవాల దృష్ట్యా వాటికి తాత్పర్యం జత చేస్తే మంచిదనిపించి అలా తాత్పర్యం జతచేశాను. అంతా ఆశ్రీరామకృపా కటాక్షమే.

హిందీమూలం తెలుగు లిపిలో జత చేయటం వలన, చదివి, కబీరు అందించిన అమృతాస్వాదన చేయటానికి ప్రయత్నించండి.

నా ఇతర రచనలను పాఠకుల సౌకర్యం కోసం నా 'వెబ్‌సైట్' www.geetadeeksha.com లో లభ్యమవుతున్నాయి. వాటిని చదివి భగవత్ కృప పొందుతారని ఆశిస్తున్నాను.

"సకల సన్మంగళాని భవంతు"



## ప్రార్థన

కం॥ శ్రీరామ నవమి నేడని
రారండిక పాడెదముగ రాముని గుణముల్
మీరినయుత్సాహంబున
సారసదళనేత్రు గొలిచి శరణనెదముగా

ఉ॥ ఆడిన మాట తప్పడట అబ్ధిని భూవలయంబు గ్రుంకియున్
వేడిన ఆర్తులై శరణు, మిన్నది గూలియు బ్రోచు బూనికన్
తోడును నీడయున్ యతడె తోయజనేత్రుని ఆశ్రయింపరే
లేడు జగాన యింకొకడు, లేడుర రాముని సాటి దైవమున్



సీ॥ సనకాది మునులెల్ల సంరంభమున మ్రొక్కు
పాదంబు నాదిక్కు వసుధయందు
సురులు, వానరులు, అసురులను, నరులు ఏ
చరణంబు గొలుతురు శరణమనుచు
గుహుడు పంతముబూని కొరికడిగినట్టి
పాదమేదో నాకు భాగ్యమదియె.
త్యాగయ్య, గోపన్న దయవేడి కీర్తించు
చరణ తోయజమేదొ పరమమదియె

తే॥ అల జటాయువు గాచిన యట్టిపదము
శబిరి ఎంగిలిదిన్నట్టి స్వామిపధము
రాతి నాతిని జేసిన రామపదము
దిక్కు నాబోంట్ల కదిగదా! దివ్యపధము



మ॥ ఘనమౌ జ్ఞానము విష్ణు ధ్యానమని మున్ కష్టంబు లైన్నైనమన్
వనజాక్షున్ హరి బ్రస్తుతించి రట ఆవాగ్గేయకారుల్ కవుల్
వినియా గాధలు 'నీవె దిక్కు' యనియా విశ్వేశు కీర్తించితిన్
కనరారమ్మని పద్యమందు విభునిన్ కన్నీట ప్రార్థించితిన్.

కం॥ కరివరదుడు హరి ధరయే
సరిలేరని సిరికి వరుని సారసనయనున్
మరిమరి మురహరి మ్రొక్కితి
కరుణారసపూర్ణు జేరి కర్మము తరుగన్

చం॥ హరి భజనంబు చేయనిదె హస్తము లెందుకు
ఎందుకొమ్మలే
సిరిపతి ఆలయంబునకు చేరని కాళ్ళవి
పుచ్చు దూలముల్
కరివరదున్ విభున్ కనని కన్నులు గోడలకున్న
రంధ్రముల్
మురియుచు పద్మనాభునికి మ్రొక్కనిదేహము
'పీడ' యేకదా!

ఉ॥ రాముని నామమున్ కపులు రమ్యముగా పలు
రాళ్ళపైన శ్రీ
రామయటంచు వ్రాసి కపిరాజుని యానతి
సాగరంబునన్
నామము పల్కుచున్ విసర నాణ్యముగా
అవి తేలె నీటిపై
రాముని "దండు" వారధిని లంకకు గట్టిరి
సంతసంబునన్



ఆ॥ కాలకూట విషము, చెలరేగు దావాగ్ని,
పాముకాటు, ఘోరవ్యాధిగాని
భూమి కంపమున్ను, భోరను సంద్రమ్ము,
హాని జేయగలవే? హరిదయున్న

ఆ॥ తెలుగు పద్యమందు తెలుప కబీరును
శక్తినిచ్చువాడు జగతి నెవడు?
రామచంద్రమూర్తి రాజీవ నేత్రుండు
పూర్వ జన్మపుణ్య ప్రోవు చేత.





## అంకితం



ఉ॥ 'రాము రహీము యొక్కట'ని లక్షలమంది కబీరు
బోధచే
తాము యెరింగినారు మన 'ధర్మము మానవప్రేమయే'
సుమా!
ఈ మహి 'సాయిరాముడు'ను 'ఈశ్వరుడందరి
కొక్కడే' అనెన్
ఆ మహితాత్ము గొల్చెదను అంకితమీకృతి
షిర్డిసాయికిన్



## భక్త కబీరు పరిచయము

మహాత్మకబీరు ఒక చక్కని మార్గమును నిర్దేశించిన ప్రవర్తకుడు. ఆయన నోటి నుండి వెలువడిన సాఖీలు, భజనలు ఆ ప్రాంత ప్రజలకు సుపరిచితము. భజనమందిరములలో, సత్సంగ గోష్టులలో యీాయన సాఖీలు పాడుకొనుచూ పరమార్థపు పాఠముల వలె వుపయోగపడుచుండెను.

కబీరు ఆరోజులలో సంతమహాపురుషుడుగా ప్రసిద్ధి చెందెను. వారు వ్రాసిన 'బీజక్' మొదలైన గ్రంథముల వలన మనకు స్పష్టమైన విషయము ఒకటి ఏమంటే మహాత్మా కబీరు తన జీవితకాలమంతా కాశీలోగడపలేదు. ఆయన కాశీ నివాసియే కాని, చనిపోయే ముందు మగహర్ అనే ప్రదేశములో చనిపోయినట్లు ఆయన రచించిన పదములను బట్టి

తెలియుచున్నది. ఆయన ఒక సాలె కుటుంబములో పెరిగినట్లు తెలియుచున్నది.

పవిత్రమైన కాశీపట్టణము కబీరుదాసు యొక్క జన్మస్థలము. తల్లిపేరు నీమా, తండ్రిపేరు నీరూ. కబీరు వారికి జన్మించిన పుత్రుడు కాడు. దొరికిన పిల్లవాడు. నీమా, నీరూ సాలెజాతి వారు.

స్వామి రామానంద గారి దర్శనము కొరకు ఒక సజ్జనుడు తన విధవ కూతురుని తీసికొని వచ్చెను. స్వామి రామానంద ఆ కూతురిని ఆశీర్వదించినపుడు "పుత్రవతి భవ" అని ఆశీర్వదించెను. కొంత కాలమునకు ఆ సజ్జనుని కూతురు గర్భవతియై మగపిల్ల వానికి జన్మనిచ్చెను. ఆ స్త్రీ సమాజపు భయముతో పిల్లవానిని త్యజించెను. అలా త్యజించబడిన బాలుడే నీరూ. నీమా దంపతులకు



శాంతిమయ వాతావరణములో చెరువు గట్టున లభ్యమైనాడు. ఆ దంపతులు విశేషమైన ఆనందముతో బాలుడిని పెంచిరి.

కబీరు మార్గమును అనుసరించిన వారి గ్రంథములలో లభ్యమైన విషయములు ఏమనగ, కబీరు బాల్యము నుంచి ధర్మపరాయణుడు మరియు ధర్మబోధకుడు. ధార్మిక సహనశీలత కారణమున మహాత్మా కబీరును హిందువులు, మహమ్మదీయులు కూడా తమనాయకుడని గౌరవించేవారు. అనేక మంది పండితులను, సాహిత్యవేత్తలను కలిసిన తరువాత చివరకు "రామానంద" గారి శిష్యునిగా కబీరు స్థిర పడిరి.

మహాత్మా కబీరు అశిక్షుతుడు. కాని ఆయన రచనలను చదివినచో మనకు బోధపడేది కాదు, కబీరు



హిందూ భావాలతో నిండిన ఒక పరమశాస్త్ర పారంగతుని వలన ప్రభావితుడైన పండితునిగా మనకు గోచరించును. ఆయన కేవలము సత్సంగము ద్వారా జ్ఞానము సమకూర్చుకొనెను. కబీరు స్వచ్ఛమైన అహింసావాది. హిందూ ధర్మ వివేచన చేసిన పూజ్య కబీరు నోటినుంచి వెలువడిన మాటలను కేవలము శాస్త్రజ్ఞులైన పండితులు మాత్రము అర్థము చేసికొన గలరు.

మహాత్మా కబీరు క్రీ॥శ॥ 1455 నుండి 1575 వరకు జీవించినట్లుగా వివిధ గ్రంథముల ద్వారా తెలియుచున్నది. ఆయన చెప్పిన విషయము - మానవ హృదయమే భగవంతుని మందిరము. కబీరు జాతి, కుల, మత భేదములను కేవలము కల్పితములని నమ్మి, ప్రచారము చేసినారు. కబీరు బాల్యమునుండి



ప్రహ్లాదుడు, ధృవునివలె భగవద్ భక్తుడు. రామ్, రహీమ్ అని పాడుతూ, ఆడుతూ స్నేహితులందరిని పాడమని ప్రోత్సహించేవాడు. తల్లి దండ్రులు బట్టలు తయారు చేసి పద్మావతీ నగరమునకుపోయి అమ్మకొని రమ్మంటే, సంతలో బట్టలుకొనే వాళ్లు ధర ఎంత అని అడిగితే, కబీరుదాసు రామ్, రహీమ్ అనేవాడట. ఆ పలుకులు, కొనేవాళ్ళకు రెండువందలు, నాలుగు వందలుగా వినిపించేవట. అలా భక్తి పారవశ్యములోనే కబీరుదాసు జీవన యాత్ర సాగించే వాడు.

కొన్ని సందర్భములలో వస్త్రాలన్నీ దాన ధర్మములు చేసి చివరకు తాను ధరించిన వస్త్రాలు కూడా దానం చేసి చిన్న అంగవస్త్రము ధరించి గృహోన్ముఖుడయ్యే వాడట. ఇతరులకు దాన ధర్మములు చేయడం మనకు భగవంతుడిచ్చిన

అవకాశమని తల్లి, దండ్రులకు నచ్చ చెప్పేవాడట. అదివిని తల్లి దండ్రులు అతనిని చితక బాదినా, రక్తము కారుచుండగా రాం, రహీమ్ అని పెద్దగా ఏడ్చేవాడట. కబీరుదాసుకు యజ్ఞయాగాదులపై, కర్మకాండలపై విశ్వాసము లేదు. హఠమార్గాన్ని ఆయన నిరసించాడు. మూర్తి పూజ అవసరం లేదని, భగవంతుని మందిరం మన హృదయమేనని కబీరుదాసు ప్రబోధించాడు. భక్తిని నటిస్తూ వేషభాషల్లో భక్తిని ప్రకటించే వారిని, కబీరు తీవ్రంగా ఖండించాడు.

భూమిక్రింది రాయి, ఆకాశంపై రాయి తిరగలి మధ్యలో సీల (కొయ్యబొడ్డు) భగవంతుడు, గింజలు జీవులు, మధ్యలో బొడ్డు దగ్గరున్న గింజలు నలగవు. రాళ్ల మధ్యలో పడ్డ గింజలు నలిగి పిండి అవుతాయి. అలాగే భగవంతుని సమీపంలో ఉన్న జీవులు క్షేమంగా



వుంటాయి. దూరంగా వున్న వాళ్లు సంసార చక్రాలక్రింద పడి నలిగిపోతారని కబీరు మానవులకు సందేశమిచ్చారు. కబీరు అంటే దివ్యుడు, మహాత్ముడు అని అర్థము. మహాత్మా కబీరు ఆ పదములకు సార్థకత కలుగచేసిన మహానుభావుడు, నిజమైన భక్తుడు.

**అన్నపురెడ్డి కృష్ణారెడ్డి**
M.A., M.Phil., BEd.



## కబీర్‌దాసు కీర్తన

ఝినీ ఝినీ బినీ చదరియా ॥
కాహే కై తానా, కాహేకై భరనీ,
కౌన్ తార్‌సె బినీ చదరియా?
        ఇంగలా పింగలా తానా భరనీ
        సుఖమన్ తార్‌సె బినీ చదరియా ॥

ఆఠ్ కఁవల్ దల్ చరఖా డోలై
పాంచ్‌తత్త్ గున్ తినీ చదరియా ॥

        సో చాదర్ సుర్ నర్ ముని ఓఢీ
        ఓఢికె మేలీ కినీ చదరియా ॥

దాస కబీర జతన్‌సే ఓఢీ
జ్యోంకీ త్యోందరి దీనీ చదరియా ॥

- మహాత్మకబీర్



## తాత్పర్యము

'ఝిన్‌ఝిన్' అను ధ్వనితో ఈ బట్ట తయారయింది. ఒకవైపు 'పడుగు', ఒకవైపు 'పేక' దారములతో తయారయింది. అవి ఎంత చక్కటి దారములు?

1. ఇంగళా పింగళా అను పడుగు పేకలతో (నిలువు ప్రక్క ఎముకలతో), 'సరి' అనే దారముల యొక్క (సుషుమ్న నాడి యొక్క) కలయికతో ఈ వస్త్రము (శరీరం) తయారైనది

2. ఎనిమిది రెక్కలుగల చరఖా తిప్పి, (అష్టదళములు గల ఎనిమిది పద్మములు సంచరించుచున్న అష్టాంగ యోగం) ఐదువన్నెల దారముతోను (పంచభూతముల తోను) మూడురకములైన దారములతో (త్రిగుణములతోను) తయారైన బట్ట ఇది.(శరీరం ఇది)

3. సాలెవాడు ఎన్నోరకాలుగా అటూఇటూ తిప్పి, కర్రతో కొట్టి పదినెలల సమయంలో తయారు చేశాడు, ఈవస్త్రాన్ని. (భగవంతుడు శిశువుని క్రిందకీ మీదకీ తిప్పి పదినెలల్లో మనిషి శరీరంగా తయారు చేశాడు.

4. రకరకాలైన వాళ్ళు, గొప్పవాళ్ళు, సామాన్యులు (సురులు నరులు మునీశ్వరులు) ధరించారు ఈ వస్త్రాన్ని (శరీరాన్ని) దీన్ని ఎంతో అపవిత్రం చేశారు.

5. కాని మహాత్మ కబీరు ప్రయత్న పూర్వకంగా ధరించి భగవంతుడిచ్చిన ఈ వస్త్రాన్ని (శరీరాన్ని) ఎంతో పవిత్రంగా ధరించి తిరిగి ఆయనకే అంత పవిత్రంగానూ సమర్పిస్తాడు.



## కబీర్‌దాసు దోహాలు

1. సాత్ సమంద కీ మసికరే, లేఖని సబ్ వనరాయి ।
ధరతీ సబ్ కాగదు కరే హరి గుణ లిఖా న జాయి ॥

ఆ॥ సప్తసంద్రములకు సరియౌ 'సిరా' నింపి
తరువులన్ని కలము తీరు జేసి
ధరణియంత కాగితంబది యున్నను
హరి గుణముల వ్రాయ లేరు సుమ్మి!

తా॥ శ్రీహరి యొక్క గుణగణములను వర్ణించి వ్రాయుట అసాధ్యం. ఎవరైనా ఏడుసముద్రాలలో ఉన్న నీటి పరిణామం గల 'సిరా' తీసికొని, ప్రపంచంలోని వృక్షాలనన్నింటితోను ఒక కలము చేసి, భూమండలమంత కాగితంపై వ్రాసినా ఆయన గొప్పతనం వర్ణించుట సాధ్యంకాదు.



2. హోడ్ బడా హరిభజన కరే ద్రవ్యబడా, కఛుదేహి ।
అకల్‌బడీ ఉపకార్ కర్ జీవన కా ఫల్ యహీ ॥

ఆ॥ మంచి మేను కలుగ భజియించుమా హరిన్,
ధనము కలిగినంత దానమిమ్ము,
మంచి తెలివియున్న పరహితం బొనరించు,
అవని సఫలతీయు జీవనమున.

తా॥ మనకున్నదంతా భగవంతుడిచ్చిందే కదా! మరి జన్మసఫలం కావాలంటే ఏం చేయాలి? మంచి దేహం ఇచ్చినందుకు ఆయన భజన చేయాలి. ధనం ఇచ్చినందుకు దానం చేయాలి. మంచి తెలివి తేటలిచ్చినందుకు పరులకు మేలు చేయాలి. అప్పుడే ప్రపంచంలో మన జీవనం సఫలంమవుతుంది.



3. మనకె మతె న చాలియె మనకె మతె అనేక ।
జోమన్ పర్ అవసారు హై, సో సాధు కోయీ ఏక్ ॥

ఆ॥ మనసు చెప్పినట్లు వినకురా ఎన్నెన్నో
త్రోవలందు నరుని బోవు మనును
మనసునదుపు నుంచు మానవుడే 'సాధు'
మేటి అట్టివాడు 'కోటి' కొకడు.

తా॥ మనసు చెప్పినట్టల్లా వినకండి. అది ఎన్నెన్నో చెప్పి మనిషిని ఏవేవో మార్గములలో పొమ్మంటుంది. మనస్సు నదుపులో ఉంచేవాడే సాధువు, గొప్పవాడు. కాని అట్టివాడు కోటికొక్కడుంటాడు.

4. కరు బహియాం బల్ అపనీ ఛాండ్ బిరాన్ ఆస్।
జాకే ఆంగన్ నదీహై, సోకత్ మరై పియాసు ॥

ఆ॥ పరులపైన కాక, బాహుబలంబుపై
నమ్మకంబు నుంచ నాణ్యమగును
ఇంటిముందు నదిని హితముగా గలవాడు
దప్పితోటి చావదెప్పుడైన.

తా॥ ఇతరులపై కంటే తన చేతుల శక్తి సామర్థ్యములపై ఆధారపడేవాడు చెడిపోడు. తనపై తను నమ్మకం ఉంచటం నాణ్యమైన పని. తన ఇంటి ఎదురుగా నది ఉన్నవాడు ఎప్పటికీ దప్పికతో మరణించడు. అలాగే భగవంతుడు ఎదురుగా ఉన్న వాడు చెడిపోడు.



5. ఏకై సాధే సబు సధై, సబుసాధే సబ్ జాయ।
జోతూ సేవై మూల్‌కో ఫూలే ఫలె అఘాయ్ ॥

ఆ॥ ఒకటి వెనుక నొకటి ఒనగూడు నన్నియున్
అన్ని ఒక్క సారి అమరబోవు
పూలు పండ్లతోటి విలసిల్ల తరువుకున్
పాదులందు నీరు పారవలయు.

తా॥ ప్రపంచంలో అన్నిపనులు ఒక్కసారి జరుగవు. ఒక దాని తరువాత ఇంకొకటవుతుంది. చెట్లకి పూలు పండ్లు కాయాలంటే వాటి "పాదు"ల్లో నీళ్ళు పోయాలి. ఆ నీరు ఇచ్చే శక్తి వలననే చెట్లు తమపని తాము చేసుకుంటాయి. అదే భగవత్ శక్తి.



6. కబీరు హసనా దూర్ కర, కరి రోవణ హై చిత్త।
బిను రోయా క్యోం పాయియా ప్రేమ్ పియారా మిత్త ॥

ఆ॥ లౌకి కంపు సుఖములను కబీరా! వీడి
మనసు నిష్టజేత వంచవలయు
ధరణి కష్టపడక దొరకునా నిజమైన
ప్రేమ? సఖుడు 'జగతివిభుడు' గాక.

తా॥ ఓ కబీరా! నరుడు దైహిక సుఖములను విడనాడి, మనస్సును నిగ్రహించి అదుపులో వుంచవలెను. ప్రపంచంలో నిజమైన ప్రేమ ఆ భగవంతుని కరుణయే. ఆ జగన్నాధుని ప్రేమ అంత సులువుగా దొరుకుతుందా? ఆయన సఖ్యత లేక ఏది సాధ్యమవుతుంది?



7. అగిని ఆంచు సహన సుగమ్, సుగమ్ ఖడగ్ కీ ధార్ ।
స్నేహ నిభాన ఏక్ రస, మహాకఠిన వ్యవహార్ ॥

ఆ॥ అగ్ని, హిమములైన అరికట్ట వచ్చును
ఖడ్గ ధార నిలుప కాదు ఘనము
మిత్ర ధర్మమొకటి మించి పాటించుట
అదియె గొప్ప కఠినమైన దిలను.

తా॥ నిప్పునుగాని, మంచునుగాని అదుపు చేయవచ్చును. పదునైన ఖడ్గాన్ని ఎదుర్కొని ఓడించవచ్చును కాని, గొప్ప మిత్ర ధర్మమును పాటించుట మాత్రం ఈ ప్రపంచంలో చాల కఠినమైన పని.

8. హరిసే జని తూ హేత్ కర్, కర్ హరిజన్‌సేహేత్ ।
మాల్ ములుకు హరి దేత్‌హై హరిజన్ హరి హీ దేత్ ॥

ఆ॥ సాధ్యపడదు "జగతిస్వామి" తో స్నేహంబు
'హరిజనుల'తొ మైత్రి అదియె సుఖము
'ధరణి విభుడు' ఇచ్చు ధన ధాన్యముల, గాని
'హరిజనుండు' కలుపు హరిని మనను.

తా॥ జగత్భర్తయైన భగవంతునితో స్నేహం అసాధ్యం. కాని హరిభక్తునితో స్నేహం చాల తేలిక. ధరణీ ధరుడు శ్రీహరి ఇచ్చేవి ధన ధాన్యములే, కాని హరిజనులు అనగా భక్తులు ఇచ్చేది మాత్రం శ్రీహరినే.



9. నిందక్ నిమరై రాఖియె ఆంగన్ కుటీ ఛవాయి ।
బిను పానీ బిను సాబునా, నిర్మల కరై సుభాయ ॥

ఆ॥ నిందజేయు వాన్కి నీయింట చోటిమ్ము
చెడును వాడె, నీకు చేయు మంచి
'సబ్బునీరు' లేక స్వచ్ఛమౌ హృదయమ్ము
నీ స్వభావమదియు నిగ్గు దేలు.

తా॥ నిన్ను నిందించే వాడికి నీ ఇంటి ముందు ఆశ్రయం కలుగు జేయుము. నిన్ను నిందించి వాడే చెడిపోతాడు. నీకు మంచే జరుగుతుంది. నీ స్వభావము కూడ మారిపోయి మెరుగుపడుతుంది.



10. సహజై సహజై సబ్‌గయె, సుత, విత, కామిని, కామ్।
అంకమేక్ హై మిలిరహ్యో దాస కబీరా రాము ॥

ఆ॥ సుతులు, ధనము, కోర్కె, సుదతి అస్థిరములు
వదలిపోవు సుమ్మి! అది సహజము
చివర మిగులువాడు శ్రీరామచంద్రుడే
అనె కబీరుదాసు, అది నిజంబు.

తా॥ పుత్రులు, ధనము, కోరిక, స్త్రీ ఇవన్నీ నిలకడలేనివి. ఏదో ఒకనాడు వదిలిపెట్టి పోయేవే. అది సహజం. శ్రీరామచంద్రుడొక్కడే స్థిరమైన వాడు. ఇది కబీరు దాసు ప్రవచనము. ఇది నిజము.



11. మాయా దీపక్ నర్‌పతంగ, భ్రమి భ్రమి యివైపడంత్ ।
కహై కబీర గురుజ్ఞానథై ఏక్ఆధఒబరంత ॥

ఆ॥ మనిషి శలభమవును, మాయయే దీపంబు
మంటదూకి కాలి భస్మమవును
ఎరుగు జ్ఞాన మట్లె ఎవ్వడో ఒక్కండు
అనె కబీరు గురువు నరయమనుచు.

తా॥ ఈ ప్రపంచంలో భగవంతుడు కల్పించిన మాయ దీపము వలె నిశ్చలమైనది. మనిషి దీపం పురుగు వంటి వాడు. ఆమాయలో పడి నాశనమై పోతుంటాడు. భక్త కబీరు ఏమంటున్నారంటే, ఎవ్వడో కోటికొకడు మాత్రమే జ్ఞానమెరిగి ముక్తి పొందుతున్నాడు.

12. పోథిపఢి పఢి జిగముబా పండిత భయా న కోయ్।
ఏకై అక్షర్ పీవకా పఢే, సుపండిత హోయి ॥

ఆ॥ చదివి చదివి గ్రంథ సముదాయ మెవ్వడున్
పండితుండుకాడు వసుధయందు
ఒక్క అక్షరంబు యెనరంగ 'రామ్' యని
తుదకు మంచి పండితుండు యౌను.

తా॥ గ్రంథముల నన్నింటిని చదివి నంతమాత్రాన ప్రపంచంలో అంతా పండితులై పోరు. 'రామ్' అన్న ఒక్క అక్షరం నేర్చుకుంటే, అతనొక్కడే చివరకు మంచి పండితుడవుతాడు.



13. లాలీ మేరె లాల్ కీ, జిత్ దేఖో తిత లాల్।
లాలీ దేఖన మైగయీ, మైభీహోగయి లాల్ ॥

ఆ॥ దివ్యుడైన "వాని" దీటైన దైవత్వ
మెంత జూడబోతె అంత గంటి,
చూడబోయి నేను సురుచిర దైవత్వ
మైతి దైవముగనె అంత్యమందు.

తా॥ దివ్యుడైన ఆ పరమాత్మ మహిమను ఎంత చూడాలని అనుకున్నానో అంత చూశాను. ఆమహాత్ముని అద్భుత మైన లీలలు చూచి, చూచి, నేను కూడా చివరకు దైవత్వమునే పొందాను.



14. తేరా సాయీ తుఝమే, జ్యోం పుహుపన్‌మే వాసు।
కస్తూరీకా మిరగ జ్యోం ఫిక్ ఫిర్ ఢూండై ఘాస్ ॥

ఆ॥ నిలిచియుండు 'సాయి' నీలోనె తెలియుమా
పూలతావి వోలె; పూని వెదకి
గడ్డి యందు, అలయు కస్తూరి మృగమది
సౌరభంపు జాడ నెరుగ లేక.

తా॥ ఆ పరమాత్మ సృష్టిలో పూలలోని తావిలా నీలోను కూడా నిలిచి యున్నాడు. కస్తూరి మృగం సువాసన తన, నాభిలోని కస్తూరి నుంచి వస్తున్నదని తెలుసుకోలేక ఎంతో ప్రయత్నించి గడ్డిలో వెదికి అలిసిపోతుంది. మన హృదయంలోనే వున్న స్వామిని ఎక్కడె క్కడో వెతుకుట దేనికి?



15. సాధూ ఐసాం చాహియే, జైసా సూపు స్వభావ।
సార్‌సార్ కో గహి రహై థోథీ దేయ ఉడాయి ॥

ఆ॥ పనికి రాని పొట్టు వదలు ధాన్యమ్మును
చేటయందు వేసి చెరిగినంత,
సాధుపుంగవుండు జ్ఞానమ్ము గ్రహియించు
వ్యర్థమైనవన్ని వదలి వేసి.

తా॥ ధాన్యమును చేటలో వేసి చెరిగితే, పనికి రాని పొట్టునెగర కొట్టి, పనికి వచ్చే దంతామనకిస్తుంది. అట్లే గొప్ప సాధువు వ్యర్థమైన విషయాలిన్న వదలివేసి పనికి వచ్చే జ్ఞానాన్ని మన కందిస్తాడు.

16. మాలా తో కర్ మె ఫిరై, జీభ్ ఫిరై ముఖ్ మాహి ।
మనువా తో చహుం దిసి ఫిరై యహితో సుమిరన్ నాహి ॥

ఆ॥ చేతిలోన మాల చిత్రంగ తిరుగును
మాటలాపదాయె నోటి నాల్క,
మనసు 'విషయ' మందు మరిమరి తిరుగాడు
దీని నాపు విధము తెలియదాయె!

తా॥ ఆ భక్తుని చేతిలో రుద్రాక్ష మాలతిరుగుతూనె వుంటుంది. అది తిప్పుతూనే ఏవేవో మంత్రములు చదువుతూ వుంటాడు. మనస్సు నిండా ఏవేవో కోరికలు. దీనినాపుటెట్లో తెలియదు. ఇక భక్తి ఎట్లా కుదురుతుంది?



17. సింహోంకె లెహండె నాహిం హంసోంకి నహి పాంతి ।
లాలోంకీ నహిం బోరియా, సాధున చలే బరాత్ ॥

ఆ॥ మెలగదాయె ఎపుడుమృగరాజు మందలో
బారు దీరి హంసలరయ లేరు
వెతుక దొరకవాయె గోతాలలో 'మణుల్'
చనరు గుంపులందు సాధులిలను.

తా॥ ప్రపంచంలో సింహం ఎప్పుడూ, ఒంటరిగా మృగరాజులా ఉంటుంది కాని గుంపులో వుండదు. హంసలు బారులు తీరి ఎగురవు. మణులు చాల అరుదుగా దొరుకుతాయి కాని వెతికితే దొరకవు. అదే విధంగా సాధువులు ఈలోకంలో ఒంటరిగా కనిపిస్తారు కాని గుంపులలో కాదు.



18. వృచ్ఛ కబహుం నహీం ఫల భఖై, నదీసా సాంచై నీర్ ।
పరమారథకే కారనై సాధున్ ధరా శరీర్, ॥

ఆ॥ తినవు పండ్లు చెట్లు తీరంగ క్షుద్బాధ
త్రాగ బోవునీరు దప్పి, నదులు.
ధరణి సాధులంత పరమార్ధమెరుగంగ
దాల్తురయ్య మేను తమకు గాదు.

తా॥ ఆకలి తీర్చుకొనుటకు చెట్లు పండ్లు తినవు. నదులు దాహం వేసిందని నీళ్ళు త్రాగవు. అవి పరులకిచ్చేవే గాని తమ కోసం వాడుకోవు. అలాగే సాధువులు ఈ ప్రపంచంలో పరమాత్మ నెరుగుటకై శరీరధారణ చేస్తారు కాని తమ కోసం కాదు.



19. కామ, క్రోధ, మద, లోభకీ, జబలౌ మన్‌మే ఖాన్ ।
తబతౌ పండిత, మూరఖౌ కబిరా ఏక్ సమాన ॥

ఆ॥ కామ, క్రోధ, మదము, కాపీనములు మదిన్
చోటు చేసుకున్న చేటు దెచ్చు
పండితుండు తాను పరమ మూర్ఖుడు ఒకే
తీరునుండు, ఇది కబీరు మాట.

తా॥ కామ, క్రోధ, మద, లోభములు మనస్సులో చోటు చేసుకుంటుంటే అవి చేటు తీసుకువస్తాయి. కబీరుదాసు చెప్పే నీతి వాక్యమేమంటే, ఆ దుర్గుణములకు లొంగి పోయిన పండితుడు, మూర్ఖుడు ఇద్దరు సమానమే.

**20.** జాతి న పూఛో సాధుకీ, పూఛ లీజియె జ్ఞాన్ ।
మోల్ కరో తర్వార్ కా, పడే రహ న దో మ్యాన్ ॥

ఆ॥ సాధుపుంగవులను జాతి నడుగ రాదు
ఎంతజ్ఞాన మొందె నెరుగువలయు,
వీర వరుల కెపుడు ఒరతోటి పని ఏమి
కత్తి పదునుతోటి కాక, ధరణి.

తా॥ ఈ ప్రపంచంలో సాధుపుంగవులు ఎంత జ్ఞాన మార్జించిరో అడగాలికాని వారి జాతి, కులం ఏమని అడుగరాదు. వీరులైన వారు కత్తి ఎంత పదునుగా ఉందో చూస్తారు గాని కత్తి ఎంత బాగుందని చూడరు.



**21.** సాయీ యితనా దీజియె జామె కుటుంబ సమాయె ।
మైభీ భూఖా న రహూం సాధు న భూఖాజాయ ॥

ఆ॥ ఇమ్ముచాలు నాకు, ఈ నాకుంటుంబము
కడుపునిండు నంత కలుగనిమ్ము
కాలనీకు కడుపు ఇల నాకునైనను
సాధువులకునైన సాయి! ఎపుడు.

తా॥ ఓ సాయీ! నాకుటుంబాన్ని పోషించుకుని కడుపులు నింపగలిగినంత ధనం చాలు నాకు. అది ఇమ్ము. ఈలోకంలో నాకు గానీ, సాధువులకు గాని ఆకలితో కడుపు కాలిపోవునట్లు చేయకుము.



**22.** హరిరస పీయా జానియే, జె కబహుం నాజాయి ఖుమాయ్ ।
ఘో మై మంతా ఘూమత్రహై, నాహీ తనకీ సార్ ॥

ఆ॥ హరి రసంబు ద్రావ ఆనందమే దక్కు
అది నశించబోదు, అమరు సుఖము.
మానవునికి యంత తనువు ధ్యాసే పోయి
భక్తి మత్తులోన పరిఢవిల్లు.

తా॥ హరి నామామృతము త్రాగినవానికి ఆనందమే మిగులుతుంది. ఆ ఆనందం ఎవ్వటికీ నశించిపోదు. ఎంతో సుఖము కలుగుతుంది. అప్పుడు మనిషికి శరీరస్పృహ నశించి 'భక్తి' అనే మత్తు విజృంభిస్తుంది.



**23.** మాఖీగుడ్మే గడిరహీ, పంఖు రహీ లపటాయీ ।
తాలీపీట్తై సిర్ ధున్నై, మీఠై బోయీమాయి ॥

ఆ॥ బెల్లమందుపడిన వెర్రి ఈగను చూడు
రెక్కలల్లలార్చు చిక్కుబిగియు
తల విదిల్చి కాళ్ళు 'టపటపా' కొట్టును
కాని తీపి వదలి కదలలేదు.

తా॥ ఈగ ఒకటి బెల్లం పాకంలో పడింది. రెక్కలు ఆడిస్తుంది, ఇంకా చిక్కు బిగిసిపోతుంది. తలవిదిలిస్తుంది, కాళ్ళు టపటపమని కొట్టు కుంటుంది. కాని చచ్చేదాక ఆ 'తీపి' లోంచి బయట పడలేదు. సంసారంలో చిక్కుకొన్న మనిషి గతీ అంతే.

**24.** రామ వియోగీ తనవికల్, తాహీ న చీక హై కోయి ।
తంబోలీకె పాన్ జ్యోం, దిన దిన పీలా హెూయీ ॥

ఆ॥ రామ విరహితుండు రవ్వంత శాంతియున్
కానలేడు, వాని కనడెవండు
'తమలపాకు' వోలె తను రోజు రోజుకీ
పాలి పోవుచుండు విలువచెడగ.

తా॥ రాముని నిరసించి దూరమైన వాడు ఎప్పటికీ శాంతిని పొందలేడు. వాడిని ఎవ్వడూ చూడడు, దిక్కుండదు. నిలవవున్న తమలపాకులాగ రోజురోజుకీ వడలిపోయి ఎందుకూ పనికిరాకుండా పోతాడు.



**25.** సాయీం సేంత్ పాయియే, బాతాం మిలెన కోయీ ।
కబీరు సాదారామ్ సోం, శిర్ బిన కటే నహెూయి ॥

ఆ॥ 'సాయి' జూచుటన్న సాధ్యమా! సులభంగ,
మాట లెన్నియైన పనికి రావు.
బేరసారములు కబీరు! కుదరవాయె,
'తలను' ఈయకున్న దరికిరాడు.

తా॥ ఆ పరమాత్మను పొందుట అంత సులభమా? ఆయన దగ్గర ఉత్తుత్తి మాటలవల్ల ఉపయోగంలేదు. ఓ కబీరా! ఆయన దగ్గర బేరసారాలు అసలు పనికిరావు. నీ తల నరికేసుకోగల త్యాగివయితేనే స్వామి దయ నీకు కలుగుతుంది.



**26.** మాటీ కాహై కుమ్హారోసె, తూక్యా రూంధై మోయ ।
ఇక దిన్ ఐసో హెూయగో, మై రూందూంగీ తోయ ॥

ఆ॥ 'క్రుళ్ళతొక్కు' తున్న కుమ్మరి వానితో,
మట్టి అన్నదిట్లు "మరువబోకు
ఒక్కరోజు నిన్ను చక్కంగ నాలోన
కలుప కొందు నింక 'కులకబోకు'.

తా॥ కుండలు చేయుటం కోసం తనను కుళ్ళ తొక్కుతున్న కుమ్మరి వానితో ఆ బంకమట్టి ఇలా అంటోంది. "ఎంత సంతోషంగా తొక్కుతున్నావురా నన్ను! ఏదో ఒకరోజు నేను నిన్ను నాలో కలిపేసుకొంటాను. మరీ అంత దూకుడు పనికి రాదు రా వెర్రివాడా!"



**27.** మాలీ ఆవత్ దేఖికై, కలియాం కతర్ పుకార్ ।
ఫూలీ ఫూలీ చున్ లయీ, కాల్హీహమారి బార్ ॥

ఆ॥ నావ జేరు నీరు, నరుడుపొందు ధనమ్ము
తోడిపోయ వలయు 'కూడ' రాదు,
రెండు చేతులెత్తి రెట్టింపు వేగాన,
మంచివాడు చేయు పనియు అదియె.

తా॥ పడవప్రయాణంలో నావలోకి నీరు చేరుతుంటుంది. దాన్ని దాచుకోకుండా రెండు చేతులతో తోడి పోయాలి. లేకుంటే నావ మునిగిపోతుంది. అలాగే భగవంతుడు మనకిచ్చిన ధనం కూడా కొంత మంచికోసం పారపోయాలి. లేకపోతే ఆ ధనమే హానిచేస్తుంది. మంచివాడు ధనాన్ని సద్వినియోగం చేస్తాడు.

28. పానీ బాఢీ నావమే, ఘరమే బాఢీ దామ్ ।
దోనోం హాథ్ ఉలీచియె, యహీ సజ్జనుకో కాము ॥

ఆ॥ 'మాలి' రాక జూచి పూలతో మొగ్గలు
పలుకుచున్న విట్లు "వగచుటేల
నేడు మీకు, కాని నిక్కంబురేపైన
మా గతియును ఇంతె మార్పురాదు."

తా॥ పూలుకోసుకోటానికి తోటమాలి తోటలో అడుగు పెట్టాడు వానిని చూచి పూలు హాహాకారాలు చేశాయి. వాటిని బిగ్గరగా ఓదారుస్తూ మొగ్గలిలా అంటున్నాయి. ఎందుకేడుస్తారు? నేడు మీవంతు, రేపు మావంతు. మార్పుండదు, మాగతి కూడా ఇంతే. ఓనరుడా! నేడు నీమిత్రుడు చనిపోయాడని ఏడవకు. రేపు నీకూ చావు తప్పదు. మాలియైన ఆస్వామి రేపు నిన్నూ తీసికెళ్ళి పోతాడు.



29. కేసనుకహా బిగారియా, జామూండ్ సాబార్ ।
మన్‌కో కాహే నమూడియే, జామె విషయవికార్ ॥

ఆ॥ వందసార్లు నీవు పంతాన నీ 'గుండు'
గొరుగుకున్న నేమి కూడ గలదు?
మనసు నదుపు నుంచి 'వాసన' తగ్గించు
తలలు బోడులైన వలపు పోదు.

తా॥ ఓ నరుడా! నీవు వందసార్లు 'గుండు' చేయించుకొని కాషాయవస్త్రాలు కట్టుకుంటే ఏమన్నా ఫలితం ఉంటుందా? చిత్త వృత్తుల నదుపులో ఉంచి సంగత్వం వదిలిపెట్టాలి. నీవు తలలు బోడులైన తలపులు బోడులా? అనే మాట నెరుగవా? సన్యాసినైనా వ్యామోహం చెరుస్తుంది.



30. జలమే బసే కమోదిని, చందాబసే ఆకాస్ ।
జో జాహీ కా, భావతా, సో తాహీ కే పాస్ ॥

ఆ॥ గగనమందు శశిని కనుగొన్న కుముదంబు
'వికసిత'వును ఇందు వింతలేదు.
భావ మైత్రి కలుగు మంచి మిత్రుని జూచి
నరుని మనసు కూడ మురియుచుండు.

తా॥ ఆకాశంలో చంద్రుని జూచి కలువభావు వికసిస్తుంది ఇందలో వింత ఏమీలేదు. మన భావాలకు కలిసిపోవు భావమైత్రిగల మిత్రులు దొరికినప్పుడు మనుష్యుల హృదయాలు కూడా ఆనందంతో వికసిస్తాయి.



31. ప్రేమ్‌న బాఢీ ఊపజై, ప్రేమ్ న హాటబికాయ ।
రాజా పరిజా జిహిరుచై, సీస్ దేయిలైజాయి ॥

ఆ॥ వెలకు అమ్ముడవదు, పెరుగదు తోటలో
రాజునుంచి పేదప్రజల వరకు
ఇచ్చి పుచ్చుకొనుట ఇది ఒక్కటేదారి
వేరుదారి లేదు ప్రేమ యందు.

తా॥ భగవందుని ప్రేమ అనన్య సాధ్యమైనది. కొందామంటే అది అంగడిలో దొరకదు. తోటలో పెరగదు. రాజునుంచి దరిద్రునిదాకా ఇచ్చిపుచ్చుకోవటం ఒక్కటే దారి. పొందాలి అంటే ముందు మనం ఇవ్వాలి. ఇంకోదారి లేదు. భగవంతుని ప్రేమించిన వారికే ఆయన ప్రేమ దక్కుతుంది.

32. సాహెబ్ సమరథ్ నహీం, గరువా గహిర్ గంభీర్ ।
జొ గున ఛోడే గున గహే ఛినక్ పూతారై తోర్ ॥

ఆ॥ ప్రభువు వలె సమర్థుడీ భువనాలలో
లేడు, దుర్గుణములు లేని వాని,
కనికరించువాడు, గంభీరుడాతండు
వీడడొక్క క్షణము కూడ సుజను.

తా॥ జగత్ప్రభువైన ఆ సర్వేశ్వరుని లక్షణాలు వివరిస్తున్నారు కబీరుదాసు. "ఆయనవలె" సమర్థుడు ఈ లోకాలన్నింటిలో లేడు. ఆయనకు ఏ చెడ్డ గుణము లేదు. దయార్ద్ర హృదయుడు. గంభీరమైన స్వభావం గలవాడు. సుజనులైన భక్తులను ఒక్క క్షణం కూడ వదిలిపెట్టడు. ఎల్లప్పుడు వారికి తోడు నీడలా ఉంటాడు.



33. జాకో రాఖై సాంయీయాం మారిన సక్కై కోయీ ।
బాల్ న బాంకా కరి సక్కై జొ జగ వైరి హోయి ॥

ఆ॥ రాముడెవని దాను రక్షింప జూచునో
పూని కాచుచుండు వాని నెపుడు.
జరుపలేడు, వాన్కి, శత్రువు ఎవ్వండు
ఆవగింజ యంత హానియైన.

తా॥ ఆ రాముడు (భగవంతుడు) తను ఎవరిని రక్షించుటకు సిద్ధమవుతాడో అతనిని అన్ని విధాలా కాపాడుతుంటాడు. ఈ ప్రపంచంలో ఆ భక్తునికి ఎట్టి శత్రువైన ఏహాని చేయలేడు. ఆఖరికి ఆవగింజంత అపకారం కూడ ఆ భక్తునికి జరుగదు.



34. సాంయీ తుఝుసే బాహిరా కౌడీ నాహిం బికాయి ।
జాకే సిర్ పర్ ధనీ తూ లాఖోం మోల్ బికాయి ॥

ఆ॥ గుడ్డి గవ్వకైన కొరగాను ఓప్రభూ!
అవని నీదు ప్రేమ నరయకున్న
విలువ నాది యెంచ పలుకును లక్షలు
కొనిన నీదు కరుణ కొంతయైన.

తా॥ ఓ సర్వేశ్వరా! ఈ ప్రపంచంలో నీ వాత్సల్యం లేకుంటే నేను గుడ్డి గవ్వ పాటి విలువ (పనికి రాని గవ్వ) చేయను. కాని నీవు నా అండ వుంటే నా విలువ లక్షల్లో వుంటుంది. కాస్తయైన నీదయ కలిగితే నాకు అంతులేని విలువ కలుగుతుంది.



35. పావక్ రూపీ నామ్‌హై, సబ్ ఘట్ రహో సమాయి ।
చిత చక్ మక లాగై నహి, ధూ ఆం హ్వైహై జాయ ॥

ఆ॥ అగ్నిరూపుడైన ఆ పరంధాముండు
ఎల్లయెడల గలడు కల్లకాదు.
చేత బట్టి కొట్టు చెకుముకి రాళ్ళతో
జ్యోతి రాదు పొగను చూడగలరు.

తా॥ అగ్నిరూపంలో యుండే పరమాత్మ సర్వత్రా వున్నాడు. ఇది నిజం అయితే గొప్ప భక్తి ఉంటేకాని ఆయన దివ్యదర్శనం కాదు. చెకుముకి రాళ్ళను ఒక దానితో ఇంకొకటి కొడితే నిప్పురవ్వలు వస్తాయి, పొగ వస్తుంది. కాని జ్యోతిరాదు. మామూలు ప్రార్థనలకి పరమాత్మ ప్రత్యక్షం కాడు సుమా.

36. నామ్ బినా బేకామ్ హై, ఛప్పన కోటి విలాస్।
కా ఇంద్రాసన బేఠిబో, కావైకుంఠ నివాస్ ॥

ఆ॥ రామనామ మెరుక రాని అజ్ఞానికి
ఏబదారుకోట్ల 'సొబగు' లుండి
ఏమి సుఖము దక్కు? ఇంద్రత్వమది ఏల?
విష్ణుపురము జూచి విలువలేదు.

తా॥ పరమాత్మపై భక్తి కలిగి ఆయన నామామృతాన్ని ఆస్వాదించని అజ్ఞానికి ఏబది ఆరు కోట్ల రకముకలైన వైభవములున్నా ప్రయోజనం ఏముంది? వానికి ఇంద్రత్వం దొరికినా, వైకుంఠ ప్రాప్తి కలిగినా ఏం విలువ ఉంటుంది చెప్పండి. వానికే సుఖందక్కుతుంది?



37. లూటిసకైతో లూటిలే, సత్తనామ్ కీ లూటీ।
పీఛే ఫిరి పఛ్‌తా హుగీ, ప్రాణీ జాహిం జబ్ ఛూటీ ॥

ఆ॥ పంచగలిగినంత పరమాత్మ నామపు
'నిజము' పంచవోయి ప్రజకు, లేక
చివరికీవు బాగ చింతించెదవు సుమా!
ప్రాణమొదలి నాక లాభమేమి?

తా॥ ఓ నరుడా! ఆ పరంధాముని నామామృతమును నీ తోటి వారికి పంచగలిగినంత పంచిపెట్టు. దాని నిజనైజమును ప్రజలకెరింగించుము. అలా చేయకపోతే తుదకు విచారిస్తావు సుమా! అవేమీ చేయకుండా నీవు మరణిస్తే జీవితమంతా వ్యర్థం కదా!



38. కహనా థా సో కహెదియా, అబ్‌కుఛ్ కహౌన జాయ్।
ఏక్ గయా దూజా రహా, దరియా లహర్ సమాయ్ ॥

ఆ॥ చెప్పదగినదంత చెప్పాను చివరికి
ఇంక చెప్పదగిన దేదిలేదు
ఒకటివెనుక ఒకటి రాకుండునా 'అల'
ఒడుచేరి నాకయున్నదేమి?

తా॥ కబీరునైన నేను చెప్పదగినదంతా చెప్పాను. ఇంకా చెప్పటానికి ఏమీ మిగలలేదు. సముద్రంలో అలలు ఒక దాని తరువాత ఇంకా వస్తూనే ఉంటాయి. సముద్రంలో ఉన్నంతసేపు అది ఉత్తుంగ తరంగం (ఎగిసిపడే అల) ఒడ్డు చేరాక అలమాయం, అవుతుంది. జ్ఞానంలో కామక్రోధాల ఉధృతం తగ్గిపోతుంది.



39. టకముని సోం మన్ లాగియా, గగన్ హిం పహుంచా।
చాంద్ బిహూనా చాందనీ అలఖ్ నిరంజన్ రాయ ॥

ఆ॥ దేవతల 'విమాన మవలీలగా నెక్కి
గగన సీమ జేరి కాంతు నచట
చందమామ కన్న చల్లని లోకాన
నిర్వికారుడైన నిఖిలపతిని

తా॥ దేవతలకి చెందిన దివ్య విమానమును అవలీలగా నెక్కి ఆకాశవీధిలో వింతలన్ని చూచెదను. చంద్రుని కంటే శీతలమ్మైన లోకములో, నిర్వికారుడైన నిఖిలేశ్వరుని గాంచెదను గాక!

**40.** మేరీ మిటీ ముక్తా భయా పాయా అగమ్ నివాస్ ।
అబ్ మేరీ దూజా నహీం ఏక్ తుమ్ హోరీ ఆస్ ॥

ఆ॥ అహము తొలగిపోయె అందిందిరా 'ముక్తి'
దివ్యపదము నేను తెలిసికొంటి
అన్యమేది యైన అనవసరంబురా
ఒక్క 'ఆశ' నీదియున్న చాలు.

తా॥ ఓ ప్రభూ! నాలో వున్న అహం అంతా అంతరించి పోయింది. ముక్తి లభించింది. దివ్యమైన పదము నెరింగితిని. ఇక ఇప్పుడు నాకు అన్యవిషయములపై అనురక్తియే లేదు. ఓ సర్వేశ్వరా! నాకునీ ఒక్కడి ఆశ యున్నచో చాలును మిగతావి అనవసర విషయాలు.



**41.** పరబ్రహ్మకే తేజకా, కైసాహై ఉనమాన్ ।
కహిబేకో శోభానహీం, దేఖే హీ పరమాన్ ॥

ఆ॥ ఊహకందగలదె! ఆ హరి పరబ్రహ్మ
దివ్యమైన వాని తేజమరయ
ఎప్పటికినియైన చెప్ప సాధ్యము కాదు,
ఏ ప్రమాణమైన నెరుగ లేరు.

తా॥ ఆ పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీహరి యొక్క దివ్యమైన తేజస్సు ఊహించగలమా? ఎప్పటికీ చెప్ప శక్యమవుతుందా? దానికి ఏ ప్రమాణమూ లేదు. తెలుసుకొనుట అసాధ్యం.



**42.** పాయాథాసాగహిరహో, రసనాలాగీ స్వాద్ ।
రతన్ నిరాలా పాయియా, జగత్ టటో లా బాద్ ॥

ఆ॥ దొరకదగిన దేదొ దొరికింది; నాలుక
తెలుసుకొంది రుచిని తీపియనుచు
చేతికందినపుడు రతనంబు దీటుగా
వ్యర్థములను పొందు యత్నమేల?

తా॥ ఏది దొరికితే ఆనందం కలుగుతుందో, అది దొరికింది నాలు ఆ నామము యొక్క రుచిని తెలుసుకొని ఆ తీపి ననుభవించ సాగింది. విలువైన రత్నము చేతికంది నపుడు నిరుపయోగమైన గులకరాళ్ళు దేనికి? రామనామముండగా అన్యమైన సుఖములనవసరం కదా!



**43.** దీపక్ జోథా జ్ఞానకా, దేఖా అపరందేవ ।
చారవేద్ కీ గమ్‌నహీం, జహాం కబీరా సేవ్ ॥

ఆ॥ జ్ఞాన దివ్వెవెలుగు కనుగొంటి, పరమాత్మ
దర్శనంబు దొరికె ధన్యుడైతి
నాకు చింత ఏల నాల్గు వేదాలకై
భువికి ఈ కబీరు సేవకుండు.

తా॥ జ్ఞాన జ్యోతియొక్క దివ్యతేజస్సును కనుగొన్నాను. ధన్యుడినయ్యాను. ఇక నాలువేదములు నేర్వని అజ్ఞాని ననే దిగులు నాకెందుకు? ఈ ప్రపంచమునకే కబీర్ దాసు సేవకుడు ఆయనకీ ప్రాపంచిక విషయాలతో సంబంధంలేదూ.

44. మాన్ సరోవర్ సుగమ్, జబ్ హంసీ కేలి కరాయ ।
ముకతా హల్ మోతీ చుగ్రై, అబ్ ఉడి అంత న జాయ ॥

ఆ॥ తాను ఈదులాడి మానస సరసునన్
హంస లెక్క చేయదన్యములను
మౌక్తికముల దినును మరిమరి రుచి జూచి
అన్యములకు ఎపుడు 'ఆశపడదు.

తా॥ రాజహంస మానసరోవరంలో ఈదులాడు తుంటుంది. అది ఆకలి వేస్తే రుచి జూచి ఏరుకుని ముత్యములను ముత్యపు చిప్పల నుండి నేరుగా తింటుంది. అంతేకాని దేన్ని పడితే దాన్ని తినదు. అట్లాగే జ్ఞాని ఆ భగవన్నామామృతాన్ని జుర్రు తుంటాడు కాని ప్రాపంచిక సుఖముల వెంట పడడు.



45. సున్న మండల్ మే ఘర్ కియా, బాజై శబ్ద్ రసాల్ ।
రోమ్‌రోమ్ దీపక్ భయా, ప్రకటే దీనదయాల్ ॥

ఆ॥ శూన్యమందు వెలసె సుందర హర్మ్యంబు
మంగళకర ధ్వనులు మారుమ్రోగె
రోమ రోమమందు అమరింది దీపమ్ము
దీనరక్షకుండు కనుల మెరిసె.

తా॥ దీనదయాళువు, రక్షకుడు అయిన ఆ పరమాత్మ కనులకు అనుభవమైనపుడు నా రోమ రోమములలో దివ్యమైన దీపము వెలుగొందినది. శూన్యంలో సుందర దివ్య సౌధం ఒకటి వెలసింది. మంగళవాయిద్యములు మారుమ్రోగినవి.



46. పానీ హీ తె హిమ్ భయా, హిమ్ హీ గయా బిలాయి ।
కబిరా, జోథాసోయి భయా, అబ్ కఛు కహా న జాయ్ ॥

ఆ॥ మంచు తాను కరిగి మారింది నీరుగా
మాయమయ్యె 'మంచు' మారె రూపు
ఏది మొదట కలదో అదె తాను అయ్యింది
ఇక కబీరు చెప్పటకును లేదు.

తా॥ మంచు కరిగిపోయి నీరుగా మారింది. ఘన పదార్థంగా ఉన్నదాని పూర్వరూపం పోయిద్రవపదార్థమైన క్రొత్తరూపం వచ్చింది. నిజానికి దాని తొలి రూపం ద్రవ్యమే. అలాగే మనం మొదలు జీవాత్మాలం తరువాత శరీరం వచ్చి మానవుల మయ్యాం. కాని మనం అసలు జీవాత్మలమే ఇది తెలిసిన పిదప ఇంకా కబీరు చెప్పుటకు ఏమీ మిగుల లేదు.



47. గున ఇంద్రి సహజై గయె, సత్‌గురు కరీ సహాయ ।
ఘటమే నామ్ ప్రకట్‌భయా, బకిబకి మరై బలాయ్॥

ఆ॥ సద్గురుండు పూని సాయమ్ము జేయంగ
ఇంద్రియముల గుణములెగిరి పోయె
ఆత్మజ్ఞాన ప్రకటనయినచో ఆపైన
వదల దతని మరల మనసు నందు.

తా॥ ఎవరన్నా సద్గురువు కృపగలిగి సహకారం అందించి జ్ఞానబోధ చేసిన గాని మన ఇంద్రియాలకుండే బలహీనతలు తొలిగిపోవు. ఆత్మజ్ఞానం ప్రకటితమైతే ఇక ఆ దివ్యజ్ఞానం నశించదు. అది మనస్సులోనే పదిలంగ నిక్షేపమై ఉంటుంది.

48. ఆతమ్ అనుభవ్ జ్ఞానకీ, జోకోయి పూఛై బాత్ ।
సో గూంగా గుడ్ ఖాయికై, కహై కౌన్ ముక్ స్వాద్ ॥

ఆ॥ అలవియౌనె జెప్ప ఆత్మానుభవమును
తేల్చి ఎవ్వడైన తెలుపుమన్న
ఎరుగ దెలుప గలుగు నిల మూగవాడెట్లు?
బెల్లమందు రుచిని వివరమిచ్చి.

తా॥ ఆత్మానుభవం ఎట్లా ఉంటుందో వివరించమంటే ఒక అజ్ఞాని ఏం చెప్పగలడు? బెల్లం తిన్న మూగవాడిని ఆ తియ్యదనం ఎలా ఉందో వివరించరా అంటే ఏం చెప్పగలడు అలాగే ఆత్మానుభవం వివరించి చెప్పాలంటే ఒక మంచి గురువు యొక్క కృపకలగాలి. మిడిమిడిజ్ఞానుల వల్ల లాభం లేదు.



49. కబిరా భరమ్ న భాజియా, హు విధి ధరియా భేఖ్ ।
సాంయే కా పరిచయ బినా, అంతర్ రహియో రేఖ్ ॥

ఆ॥ పరుగులాపదుర కబీరు ఈ చిత్తమ్ము
వేలకొలది వేయు వేషములను
అంతమౌనె! మనిషి అజ్ఞాన రేఖలు
స్వామి ఈయకున్న పరిచయంబు.

తా॥ ఓ కబీరూ! మానవుడి ఈమనస్సు చాంచల్యంతో పరుగులు పెట్టటం మానడు. రకరకములుగా వేలకొలది వెర్రి మొర్రి వేషాలు వేస్తుంటుంది. దీని అజ్ఞాన రేఖలు అంతమవుతాయా? ఆ భగవానుడు, తన పరిచయభాగ్యం మనకు కలిగించక బోతే ఆయనను తెలుసుకునే శక్తి మనకుందా?



50. జ్యోం గూంగే కా సైన్ కో గూంగా హీ పహిచాన్ ।
త్యోంజ్ఞానీ కేరీసఖ్‌కో జ్ఞానీ హెూయ సో ఖాన్ ॥

ఆ॥ మూగవాని భాష మూగకే తెలియును
పరులకెట్లు కలుగు పరిచయంబు?
జ్ఞాని పొందు సుఖము జ్ఞానియే ఎరుగను
ఒరుల కెట్లు తెలియు నుర్వియందు?

తా॥ ఒక మూగవాడు సైగలు చేసన్తా తన మనోభావాలను తెలుపుతాడు. అది ఇంకొక మూగవాడు మాత్రమే తెలుసుకోగలడు. ఇంకొకళ్ళకి అది అర్థం కాదు. అదేవిధంగా మౌనంగా ఆత్మానందం అనుభవించే వాడు పొందే సుఖం ఇంకొక ఆత్మజ్ఞాని తెలుసు కోగలడు గాని అన్యులెరుగలేరు.



51. హంసా పయకో కాఢిలె ఛీర్‌నీర్ నిరవాన్ ।
ఐసెగహై జోసార్‌కో, సో జన్ ఉతరై పార్ ॥

ఆ॥ క్షీర నీరములను వేరుజేయును 'హంస'
దానిగుణము అదియె ధాత్రియందు
సుజను డట్లె పూని సుజ్ఞాన సారంబు
వేరు జేయగలడు 'విషయమందు'.

తా॥ హంస పాలలో, నీరు కలిసి పోయి ఉంటే పాలను స్వీకరించి నీటిని విసర్జిస్తుంది. ప్రపంచంలో అది దానికుండే అద్భుతమైన గుణం. అట్లాగే మంచివారైన జ్ఞానులు విషయ సుఖములను విసర్జించి సుజ్ఞాన సారమును గ్రహింతురు.

52. ఛీర్‌రూప సతనామ్‌హై, నీర్‌రూప వ్యవహార్ ।
హంసరూప కోయీ సాదుహై, తత కా ఛాన్ న హార్ ॥

ఆ॥ క్షీర రూపమదియె మెరుగైన జ్ఞానమ్ము
నీరు 'విషయవాంఛ' మారురూపు
హంసలాంటి సాధులందరు 'వడబోసి'
తత్వ మెరుగ గలరు 'తగులు కొనక'.

తా॥ క్షీర నీరములు జ్ఞానమునకు, విషయ వాంఛకు ప్రతీకలు (మారు రూపములు). జ్ఞానులైన సాధువులు హంసల వంటి వారు. వారు వడబోసి పాలను మాత్రమే గ్రహించు హంసవలె తత్త్వమును గ్రహించి, విషయ వాంఛలను తగులుకొనక విసర్జించెదరు.



53. సమదృష్టీ సతగురుకియా, మేటా జరత్ వికార్ ।
జహాం దేఖే త హాం ఏకహీ సాహబ్ కా దీదార్ ॥

ఆ॥ సద్గురుండు తాను సమదృష్టి నెరిగించి,
'సలుపు' ఆ వికారములను 'మాపు'.
జగతి నట్టివాన్కి స్వామి దర్శనమౌను
ఎచట వెదకి గాని అచట గనును.

తా॥ సద్గురువైన మహాను భావుడు శిష్యునికి సమదృష్టిని బోధించి వానిని కలత బెట్టు మనో వికారములను తొలగిస్తాడు. అటువంటి ఆ సర్వేశ్వరుని ఇందుగలడందు లేడని సందేహము వలదు అన్న చందనము కనుగొంటాడు.



54. సమదృష్టీ సత్ గురు కియా దీయా అవిచల జ్ఞాన్ ।
జహాందేఖే తహాం ఏకహీ దూజా నహీం ఆన్ ॥

ఆ॥ సద్గురుండు తాను సమదృష్టి బోధించి
నిర్వికారజ్ఞాన నిధిని దెలుపు
ఎచట వెదుక సాయి నచటనే గాంతురు
ఇతర మందు రుచిని యెరుగ లేరు.

తా॥ సద్గురువైన ఒక మహానుభావుడు తన శిష్యునికి సమదృష్టినలవరచి, నిర్వికారము అచంచలము అయిన జ్ఞానము నందించును. అప్పుడు ఆ శిష్యునికి సర్వకాల సర్వావస్థలలో భగవంతుడు ఎదురుగా ఎక్కడనైన కనిపిస్తాడు. అపుడు ఇంకే విషయం మీద ఆసక్తి యుండదు. అంతయు నీవే హరిపుండరీకాక్ష అని పాడుకుంటూ ఉంటాడు.



55. జబ్‌లగి నాతా జగత్‌కా తబ్‌లగ్ భక్తి నహోయి ।
నాతతోడై హరిభజై భక్త కహోవై సోయి ॥

ఆ॥ జగతి తోటి కలుగ సంబంధమాపైన
భక్తి కుదరబోదు స్వామిపైన
బంధనాలు వదలి భజియించినన్ హరిన్
భక్తులెచట నున్న స్వామి యచటె.

తా॥ ఒక్కసారి ప్రపంచ విషయాలపై ఆసక్తి పెరిగి బందం పెంచుకుంటె ఇక భగవంతునిపై భక్తి కుదరటం అసాధ్యం. భవబంధాలను త్యజించి ఆ శ్రీహరినామ సంకీర్తన మొదలు పెడితె ఆభక్తులెక్కడుంటే ఆ స్వామి కూడ అక్కడే ఉంటాడు.

56. ఖేత్ బిగాయ్యో ఖరతువా, సభా బిగారీ క్రూర్ ।
భక్తి బిగారీ లాలచీ, జ్యోం కేసర్ మేఘూర్ ॥

ఆ॥ కలుపు మొక్క చెఱచు పొలమందు పంటను,
సభను చెఱచు క్రూర జనులు తాము
భక్తినంత చెరచు మనిషి లోభితనంబు
కూడి ధూళి చెఱచు "కుంకుమ విరి".

తా॥ పొలంలో పెరిగే కలుపు మొక్క పొలమునకు హాని చేస్తుంది దుష్ట స్వభావంగల దుర్మతులు సభను పాడు చేస్తారు. ఒక మనిషికి లోభత్వం నశించకుంటే అది అతని భక్తిని నాశనం చేస్తుంది. కుంకుమపువ్వుతో అదే రంగులో ఉన్న మట్టికలిస్తే దాన్ని అవతల పారేయాల్సిందే, గత్యంతరం లేదు.



57. కామ్, క్రోధ్, లాలచ్, యిన్‌తే భక్తిన హోయి ।
భక్తికరై కోయి సూరమా, జాతివరన్ కుల్ ఖోయ్ ॥

ఆ॥ కామ క్రోధములను కాపీనమును మదిన్
జేరినంత కలచి చెఱచు భక్తి,
భక్తుడైన ఘనుడు పాటించడెన్నడున్
జాతి మతము కులము జాడ మరచు.

తా॥ కామ క్రోధ లోభములు మనస్సులో తిష్ఠ వేసుకొంటే అవి మనస్సును చెడ్డ త్రోవలో నిలిపి భక్తిని నశింపజేస్తాయి. అందుకనే భక్తుడైన సజ్జనుడు జాతి, మత, కుల తారతమ్యముల నెంచక సర్వమానవ కళ్యాణం కోరుకుంటాడు.



58. జల్ జ్యోం ప్యారా మాఛరీ, లోభీప్యారా దామ్ ।
మాతాప్యారా బాలకా, భక్తి పియారా నామ్ ॥

ఆ॥ నీరు మీద ప్రేమ నీటిలో చేపకు,
ప్రీతి సంపదందు పెంచు లోభి
బిడ్డడన్న గొప్ప ప్రేమరా తల్లికి
భక్తులకును ప్రేమ ప్రభువు పైన.

తా॥ నీటిలో నివసించే చేపకు నీటి మీదప్రేమ ఉంటే, లోభికి సంపత్తి మీద ప్రేమ ఉంటుంది. తల్లికి తన బిడ్డ మీద విపరీతమైన ప్రేమ ఉంటుంది. అదే విధంగా భగవద్భక్తునికి ప్రేమ కేవలం ఆ పరమాత్మపైననే ఉంటుంది.



59. జబ్‌లగి భక్తి సకామ్‌హై తబ్‌లగి నిష్ఫల్‌సేవ్ ।
కహ కబీర్ వహ క్యోం మిలై నిఃకామీ నిజ్‌దేవ్ ॥

ఆ॥ కోర్కెచావకున్న కుదరదురా భక్తి
ఎంత 'సేవ' జేసి ఏమి ఫలము?
'కామి' కెట్లు దొరుకు రామనామపు తీపి
అని కబీరు నిజము తాను తెలిపె.

తా॥ కబీర్‌దాసు ఈ గొప్ప సత్యాన్ని బోధిస్తున్నారు. మనిషికి ముందుగ కోర్కెలణగి పోవాలి. అదిలేక భక్తి కుదరటం అసాధ్యం. ఎంత సేవాకార్యక్రమాలు నిర్వహించినా లాభంలేదు. రామ నామంలోని మాధుర్యం కోరికలు అడగని వానికి ఎట్లా తెలుస్తుంది.

60. భక్తిగేంద్ చౌగాన్ కొభావై కొయీంలైజాయ్ ।
కహెకబీర్ కఛు భేద్ నహీం, కహాం, రంక్ కహాంరాయ్ ॥

ఆ॥ భక్తి అనెడి గొప్ప 'బంతి ఆటందునన్'
బంతి చేతికందు వాడె 'ఘనుడు'
రాజు పేదలందు రవ్వంత భేదంబు
లేనె లేదు నిజము అనె కబీరు.

తా॥ కబీర్ దాసు చెప్పిన నిజం గ్రహించండి. 'భక్తి' అను ఒక బంతి ఆటలో బంతి ఎవడి చేతికి దొరికితే వాడే విజేత. ఆటలో పరిపాలించే రాజయినా, కూటికి లేని పేద అయినా రవ్వంత తేడ కూడ ఉండదు. సుజనులైతే రక్ష, దుర్జనులైతే శిక్ష. అంతే. ఇంకో లోపాయకారి విధానం లేనే లేదు.



61. లవ్‌లాగీ తబ్ జానియె ఛూటీ కభూం నహింజాయ్ ।
జీవత్ లవ్‌లాగీరహై మూయె తహహిం సమాయ్ ॥

ఆ॥ అగ్నివంటి ప్రేమ అంటూ కొన్నను జాడ
వదల బోదు ఎంత భారమైన
చివరి వరకు నిలచు జీవితమందది
చావు ఒకటి దాని 'జతను' ద్రుంచు.

తా॥ ఆ భగవంతునిపై భక్తునికి ఒక్కసారి ప్రేమ కలిగిందంటే ఇక అది తరగదు. ఎంతకష్టమైనా ఆప్రేమ వృద్ధి చెందుతూనే ఉంటుంది. చివరి ఘడియల వరకు స్థిరంగా ఉంటుంది. జీవితంలో చావు ఒక్కటే ఆ భక్తుని స్వామి నుండి వేరు చేయగలదు.



62. లాగీలగన్ ఛూటై నహీంజీబ్, చోంచ్ జరితాయి ।
మీఠాకహా అంగార్‌మే, జాహిచకోర్ చబాయ్ ॥

ఆ॥ ప్రేమ తగులు కొన్న వీడదు ఎన్నడున్
నిప్పతిను 'చకోరి' చప్పరించి
నాల్క ముక్కు కాలినను వీడిపోలేదు
తీపియనుచు భ్రమసి తపనజెందు.

తా॥ ఒక్కసారి ప్రేమించడం (భగవంతుని) మొదలయితే ఆ ప్రేమ ఎన్నటికీ మారదు చకోర పక్షి నిప్పును తింటుంది. దాని నాలుక ముక్కు కాలిపోయినా అది నిప్పుని తినడం మానదు. అచ్చటి నుంచి ఇంకొక చోటికి పోదు. తీపిగా ఉంటుందని భ్రమించి, నిప్పును తింటుంది.



63. సోజన్‌తో సుపనే మిలై, జాగేంతో మన్ మాహీం ।
లోయన్ రాతా సుధిహరీ, బిఛురత్ కబహుం నాహి ॥

ఆ॥ కలిగినంత నిదుర కలలోన కనిపించు,
మేలుకొన్న మదిని నిలిచియుండు.
అన్ని స్వామికేను అర్పణ జేసెదన్
ఏది ఏమి అయిన వదలబోను.

తా॥ నా సర్వస్వం ఆస్వామికే అర్పిస్తాను. ఏది ఏమైనా ఆయనను వదలలేను. నేను నిద్రపోతే నాకలలోకి వస్తాడు. మెలకువతో ఉంటే మనస్సులో ఉంటాడు. ఇక ఆస్వామి నెట్లా మరువను?

64. తూంతూం కరతా తూంభయా, తుఝుమేరహా సమాయ్ ।
తుఝు మాహీం మన్ మిలి రహా, అబ్‌కహాం అనత్ న జాం ॥

ఆ॥ 'నీవు నీవు' అనుచు నేను నీవయితిని
నిలిచిపోతినయ్య నేను నీలొ
మనసు లగ్నమయ్యె పరమాత్మ! నీపైన
ఎచట పోగలాడ? ఇంకనేను.

తా॥ నా సర్వస్వం నీవే. నీవే నేను అనుకొంటూ చివరికి నేనే నీవు అయిపోయాను. నీలో నిలిచిపోయాను. ఇక ఓపరమాత్మా! నామనసు నీపై లగ్నమయింది. మరి నేనెక్కడికి పోగలను?



65. ఔర్‌కర్మ సబ్ కర్మహై, భక్తికర్మ నిష్కర్మ ।
కహైకబీరు పుకారికై, భక్తి కరొ తజి ధర్మ ॥

ఆ॥ భక్తికర్మ అదియె పరికించ నిష్కర్మ
కట్టుకర్మలన్య కర్మలెల్ల,
భక్తి చాలు మనకు వలదన్య ధర్మముల్
అరిచి చెప్పినాడు ఆ కబీరు.

తా॥ కబీరుదాసు ఎలుగెత్తి ఈవిధంగా చెప్పారు. ఈ ప్రపంచంలో మనం ఆచరించే కర్మలన్నీ మనకు ఫలితమిచ్చి కట్టి పడేసేవే. ఒక్క భక్తితో కూడిన కర్మ మాత్రమే నిష్కర్మ అది బంధం కలిగించదు. అందువల్ల మనకు భక్తి చాలు. అన్య ధర్మములు అవసరం లేదు.



66. సుమిరన్ సురత్‌లగాయికై, ముఖ్‌తేంకఛూన బోల్ ।
బాహర్ కె పట్ దేయికె, అంతర్ కే పట్ ఖోల్ ॥

ఆ॥ స్మరణమందు బాగ హరిని భజించిన
చాలు, నోటి అరుపు లేలపైకి?
బయట 'తలుపు' లన్ని బాగుగా తెరిచావు
లోన 'తలుపు' మూసికొనిన మేలె?

తా॥ భగవంతుని బాగుగా స్మరించి, భజించిన చాలును. నోటితో పెద్దగా పలుకుతూ ధ్యానించనక్కరలేదు. ప్రపంచంతో సంబంధం పెట్టుకొన్నాం కనుక మన హృదయానికున్న బయట తలుపులు తెరిచే ఉన్నాయి. కనీసంలోని తలుపులు అంటే మనస్సులోని ఆలోచనలను మూసేయాలి. అంటే నిరోధించాలి.



67. మాలాఫేరత్ జుగ్ భయా, ఫిరా న మన్ కా పీర్ ।
కర్‌కా మన్‌కా డారిచె మన్ కా మనకా ఫేర్ ॥

ఆ॥ తిరుగుచుండు చేత నిరతంబు జపమాల
మనసు తిరుగుచుండు 'పనుల' మీద
చంచలంపు మనసు సహకరించని నాడు
ఏమిచేయగలడు ఇంక అతడు.?

తా॥ ఆతని చేతిలో నిరంతరం రుద్రాక్షమాల తిరుగు తూనే వుంటుంది. మనసు మాత్రం ఆ పనిమీద ఈ పని మీద తిరుగు తుంటుంది. చంచలమైన నామనస్సు నాకు సహకరించక పోతే నేనింకా ఏం చేయగలను?

68. సుఖమే సుమిరన్ న కియా దుఖమేంకియా యాద్ ।
కహ కబీరు తా దాస్ కీ కౌన్ సునై ఫిరియాద్ ॥

ఆ॥ సుఖము కలుగునపుడు 'సుంత' స్మరిపండు,
కాళ్ళ బేరమాడు కలతలందు,
హరి వినంగబోడు అతని ఫిర్యాదును
అనె కబీరుదాసు మనిషి గూర్చి.

తా॥ మనిషి ఎంత స్వార్థపరుడంటే, వాడు సుఖాలలో తేలియాడు సమయంలో కొంచెం కూడ భగవంతుని గురించి తలుచుకోడు. ఇక వాడు కష్టాల్లో ఉంటే కాళ్ళ బేరానికి వచ్చి దేవుడే దిక్కు అంటాడు. అటువంటి వాడి ఫిర్యాదులను ఆ భగవంతుడు వింటాడా? ఎంత మాత్రము వినడు అని కబీరుదాసు చెప్పారు.



69. జాపమర్రై అజపా మర్రై, అనహద్ భీ మర్ జాయ్ ।
సురత్ సమానీ శబ్దమే తాహి కాల్ నహిం ఖాయ్ ॥

ఆ॥ నాస్తికుడును 'చనును' ఆస్తికుండును 'చనున్'
ఆత్మ నిష్ఠుడైన అవని నొదులు
జ్ఞాన మెరుగగోరి అనవసరంబైన
కాలయాపనందు కలుగు నేమి?

తా॥ భగవంతుని నమ్మని నాస్తికుడూ చనిపోతాడు. నమ్మే ఆస్తికుడూ చనిపోతాడు. ఆత్మనిష్ఠగల విరాగీ చనిపోతాడు. అటువంటి పరిస్థితుల్లో జ్ఞానము నేర్వదలచిన వానికి అనవసరమైన కాలయాపనతో ఒరిగేదేమిటి?



70. కబిరా ఛుధాహై కూకరీ కరత్ మేం భంగ్ ।
యాకో టు కడా డారికై సుమిరన్ కరో నిసంకా ॥

ఆ॥ ఆకలైన 'కుక్క' అరుపులు మానదు
భంగపరచుచుండు 'భక్తి పథము'
రొట్టె ముక్క వేసి రోజంత సుఖముగా
ధ్యానమందు గడపుమనె 'కబీరు'

తా॥ కుక్కకు ఆకలి వేస్తే అరుస్తూనే ఉంటుంది. అలాగే ఆకలితో ఉన్నవానికి భక్తి కుదరదు. కుక్కకు రొట్టె ముక్కవేస్తే తిని అరుపులు మానేస్తుంది. అట్లాగే ఆహారం తిని ధ్యాన సమాధిలో ఉండేవాడు ధ్యాన నిష్ఠలో ఉండగలడు. కబీరుదాసు ఆకలిగురించి అలా వివరించారు.



71. కబిరా క్యాహై చింతహూం, మమ చింతె క్యాహోయ్ ।
మేరీ చింతా హరికర్రైం చింతా మోహీం న కోయ్ ॥

ఆ॥ అనె కబీరు నాకు ఆలోచనెందుకు?
'చింత గూర్చి నాకు చింత ఏల?
తరచి నాదు చింత 'హరి' చేయుచుండగా
'చింత' నేను మరల చేయనేల?

తా॥ కబీరుదాసు ఈవిధంగా అన్నారు. నేను ఆలోచించ వలసిన అవసరం లేదు. దుఃఖం కలుగుతుంది అన్న విచారం అసలు లేదు. నాదుఃఖాన్ని హరి తీరుస్తుంటే నాగురించి మరల నేనెందుకు విచారపడాలి.?

72. సాధూ గాంఠన బాంధయీ వుదర్ సమాతా లేయి।
ఆగే పాఛే హరి ఖడే జబ్‌మాంగే తబ్ దేయి ॥

ఆ॥ సాధు ధనము దాచు సంచితో తిరుగడు
పొట్ట నింపుకూడు యున్న చాలు
ముందువెనుకలుండు మురవైరి యిచ్చును
ఎపుడు వేడుకున్న అపుడె యిచ్చు.

తా॥ సాధువైనవాడు ధనం మూటకట్టుకుని తిరుగడు ఆరోజు కడుపునింపు కొంటాడు కాని, దాచుకొని మూట కట్టుకోవాలని భావించడు. మనముందు వెనుకా ఉండినడిపించే వాడు ఆ పరంధాముడే కాబట్టి ఎప్పుడు వేడుకొంటే అప్పుడిస్తాడు ఇక దాచుకోవాలనే ఆశ దేనికి అని విరాగియై ఉంటాడు.



73. పా ఫాటీ పగరా భయా జాగే జీవా జూన్।
సబ్ కాహు కో దేత్ హై చోంచ్ సమాత్ చూన్ ॥

ఆ॥ తెల్లవారి పోయి తెచ్చింది వెలుగును
ప్రాణులన్ని మునిగె పనులయందు
సర్వప్రాణులకును సమకూర్చు 'తిండిని'
వాసుదేవుడెపుడు వలసినంత.

తా॥ తెల్లవారిపోయి లోకంలో సూర్యకాంతిరాగానే, ప్రపంచంలోని ప్రాణులన్నీ నిద్రవదలివైచి కడుపునింపు కోటానికి ప్రయత్నాలు చేస్తాయి. అయితే సర్వ ప్రాణులకు తిండిపెట్టే దెవరు? ఆ పరాత్పరుడు మాత్రమే. ఎవరికి ఎంతప్రాప్తమో అంత తిండిని సమకూరుస్తూనే ఉంటాడు.



74. విరహ భువంగమ్ తన్ డసా, మంత్ర నలాగై కోయ్ ।
నామ్ వియోగీ నాజియె, జియెతో బావుర్ హోయ్ ॥

ఆ॥ భ్రమరయొకటి కుట్టి మనసంత చెరి చెను
వేరు యోచనేది ఎరుగనీదు
హరిని మరచు వాడు అవని జీవించడు
మతి భ్రమించి తిరుగు బ్రతికియున్న.

తా॥ కోరిక అనే తుమ్మెద కుట్టిందంటే, మనస్సునంతా కలచివేస్తుంది. ఇంకో ఆలోచన రానీయదు. శాంతి దొరకదు. అతడు హరికి (భగవంతునికి) తప్పక దూరమౌతాడు. వాడు ఒక వేళ జీవించి ఉన్నా, మతి చలించిన పిచ్చివాడై అంతు లేని కోరికలతో జీవిస్తాడు.



75. సురతికరెం మేరే సాయియాం, హమ్‌హైం భవ జల మహి।
ఆపెహీ బహి జాయెంగే, జో నహీం పకరే బాహిం ॥

ఆ॥ దేవ! పాహియనుచు దివ్య నామస్మరణ
తోటి, భవజలధిని దాటవలయు
స్మరణ జేయకున్న తరియించనే లేరు
మనని కాచువాడు మాధవుండు.

తా॥ ఈ భవనసాగరందాటుటకు ఒక్కటే మార్గం ఉంది. అది "ఓసర్వేశ్వరా! రక్షించు" అని, దివ్యనామస్మరణ చేస్తూ ప్రార్థించుటయే. నామస్మరణ చేయని వాడు ఆసాగరాన్ని దాటటం అనేది జరుగదు. ఎందుకంటే మనలనందరిని రక్షిస్తున్నదెవరు? ఆసర్వేశ్వరుడే కదా!

76. జబ్ మై థా తబ్ గురు నహీం, అబ్ గురు హై హమ్ నాహిం ।
ప్రేమ్ గలీ అతి సాంకరీ తామైం దో న సమాహి ॥

ఆ॥ గురుని కనుగొనంగ తరుగు నస్తిత్వంబు
'నేను తొలగిపోయి, నిలుచు హరియె
'ప్రేమ'యనెడి 'గొందు' మిక్కిలి ఇరుకురా
ఇరువురికిని చోటు దొరకదచట.

తా॥ గురుకృప కలిగినంతనే మన 'అస్తిత్వమే' తొలగిపోతుంది. 'నేను' అనే స్వార్థమే ఉండదు. అంతా ఆ శ్రీహరియే అనే భావం ఆస్వామిపై 'ప్రేమ' కలుగుతాయి. ప్రేమ అనేది ఒక ఇరుకైన 'సందు' లాంటిది అందులో ఇద్దరు పట్టే చోటుండదు. ఉంటే ఆ'దైవభక్తి' లేక పోతే 'కోరికలు' ఇది ఉంటే అది ఉండదు.



77. జా ఘట్ ప్రేమ న సంచర్రై, సోఘట్ జాన్ మసాన్ ।
జైసి ఖాల్‌లోహార్‌కీ సాస్ లేతే బిను ప్రాణ్ ॥

ఆ॥ కలుగకున్న ప్రేమ కాయమే మరుభూమి
మేలు ఏమి దాని వలన కలుగు?
గాలి పీల్చి వదలు 'కమ్మరితిత్తిరా'
కదులుతుంది కాని, కలడె జీవి?

తా॥ ఆపరమాత్మపై 'ప్రేమ' కలుగని వాడి దేహం ఒక స్మశానం లాంటిది. అట్టి తుచ్ఛమైన శరీరం వలన మనిషికేమి ఉపయోగం? కమ్మరి వాడు కొలిమిలో నిప్పు జ్వలిస్తూ ఉండాలని ఒక తోలు తిత్తిని నొక్కుతూ గాలి దొంట్లోకి తెప్పించి బలంగా బయటకు పంపుతూ నిప్పు రాజుకొనేలా చేసి ఇనుమును ఎఱ్ఱగా కాల్చి దానితో పనిముట్లు చేస్తాడు. అట్లా గాలిపీల్చి వదిలే మానవదేహంలో దైవం అయిన 'జీవాత్మ' లేకపోతే అది తోలు తిత్తే కదా.



78. సౌ జోజన్ సాజన్ బసై మానోం హృదయ మంఝూ ।
కపట్ సనైహీ ఆంగనే జాన్ సముందర్ పార్ ॥

ఆ॥ నూరు యోజనాల దూరంబు నున్నను
మంచి మిత్రుడుండు మనసునందె.
కపట స్నేహితుండు గడపలో నున్నను
సంద్రమవతలున్న 'సఖుడె' సుమ్మి!

తా॥ ఒక సన్మిత్రుడు నూరుయోజనాల (800 మైళ్ళ) దూరంలో ఉన్నా మన మనస్సులోనే ఉండి ఆనందం కలిగిస్తాడు. భగవంతుడు కూడ అంతే. కాని, స్నేహం నటించే దొంగ మిత్రుడు మాత్రం ప్రక్కనే ఉన్నా సముద్రం అవతల ఉన్నట్లే. అట్టి స్వార్థపరుడు నిరుపయోగి సుమా!



79. పీయా చాహే ప్రేమరస్ రాఖా చాహే మాన్ ।
ఏక్ మ్యాన్‌మే దోఖడగ్ దేఖాసునా న కాన్ ॥

ఆ॥ స్వాభిమానమున్ను, స్వామి సాంగత్యమ్ము
ఒరను రెండు కత్తులుండునట్లె
కళ్ళు చూడలేవు, కర్ణముల్ వినలేవు
స్వామి కృపను గనడు స్వాభిమాని.

తా॥ మనిషికుండే అహంకారమూ, స్వామిపైన ఉండే భక్తి రెండు విరుద్ధమైనవి. రెండు కత్తుల వంటివి. ఒక ఒరలో రెండు కత్తులు ఉండలేనట్లే అహంకారమున్న వాడికి భక్తి కుదరదు. అహంకారికి కళ్ళు కనపడవు, చెవులు వినపడవు. ఆభగవంతుని కృపామృతం త్రాగుట ఎలాసాధ్యమవుతుంది? అవదు.

80. మిల్ నా జగ్‌మే కఠిన్ హై మిలి బిఛుడో జనికో ।
బిఛుడే సజ్జన్ తెహి మిలై జిన్ మాథే మని హెూం ॥

ఆ॥ స్వచ్ఛమైన మైత్రి సాధ్యమా దొరకంగ?
దొరికినంతదాని తోడు విడకు
దూరమైన సఖుడు దొరికినవానికి
వాని నొసట నున్నమణియె సుమ్మి!

తా॥ నిర్మలమైన మైత్రి దొరుకుట అసాధ్యము. ఒక వేళ దొరికితే ఎట్టి పరిస్థితుల్లోను దానిని విడనాడకు దూర దేశంలో అనుకోకుండా మన పాతమిత్రుడు దొరికితే వదిలిపెడతావా? తలలో అలంకరించుకొనే దివ్యమైన (పాపిడిబిళ్ళ) మణిలాగ భద్రంగా చూసుకొందుము కదా! అట్లాగే దైవకృప కలిగితే ఎన్నడూ విడిచిపెట్ట కూడదు.



81. నైనోంకీ కరికోఠరీ పుతలీపలంగ్ బిఛాయి ।
పలకోంకి చిక్‌డారికై పియకోలియా రిఝు ॥

ఆ॥ కనులు అనెడు మంచి ఘనమైన కోటలో
పాన్పు చేసి కంటిపాప నీవు
మూసి కంటి రెప్ప మురహరిన్ ప్రియ బంధు
చేసికొని ప్రసన్ను చేయవలెను.

తా॥ పరమాత్మను మన ప్రియ బాంధవుని చేసుకొనే ఉపాయా చెబుతున్నారు కబీరు. మనకన్నులను సురక్షితమైన 'కోట' వలె చేసి, అందులో 'కంటిపాప' అనే చక్కటి పానుపు పరచి, నిశ్చలంగా కనురెప్పలు మూసి (ధ్యానించి) ఆస్వామిని ప్రసన్నుని చేసుకోవాలి. ఇంతకంటె మార్గంలేదు.



82. కసత్ కసౌటీ జో టికై తాకో శబద్ సునాయి ।
సోయీ హమరా వంసమై, కహికబీర సముఝాయి ॥

ఆ॥ ఆకురాయి 'గీటు' అదె మేలిమికి 'ధీటు'
అందు గెల్చువాడు అసలు 'జ్ఞాని'
మానవతకు అదియె మంచి పరాకాష్ఠ
అనె కబీరుదాసు మనిషి గూర్చి.

తా॥ మనిషి గురించి చెబుతూ కబీరు ఇలా అన్నారు. "మేలిమి బంగారం యొక్క వన్నె తెలుసుకోవాలంటే దానిపై ఆకురాయితో గీటు పెట్టక తప్పదు. అట్లాగే భగవంతుని పరీక్షలకు తట్టుకొని నిలిచిన వాడే అసలైన జ్ఞాని మానవతకు అట్టి పరీక్షయే పరాకాష్ట. వేరేమికాదు."



83. దుఖమే సుమిరన్ సబ్‌కరై సుఖమే కరైన కోయి ।
జొసుఖమే సుమిరన్ కరై తోదుఖకాహే హెూయి ॥

ఆ॥ మనిషి దుఃఖమందు మాధవున్ శరణను
సుఖములందు హరిని జూడ బోడు
సుఖములందు హరిని చుట్టంబుగా గొల్వ
దుఃఖమేల కలుగు సుఖము దక్కు?

తా॥ బాధలు కలిగి నప్పుడే మనిషి భగవంతుని తలుచుకొంటాడు. సంతోషంగా ఉంటే ఆ స్వామి గుర్తే ఉండడు. ఒక్కటి ఆలోచించండి సుఖములందు కూడా శ్రీవారే బంధువని తలచేవాడికి అసలు దుఃఖం ఎందుకు కలుగుతుంది సుఖమే దొరుకుతుంది.

84. సహజె హీధున్ హొూత్హై, హర్ దమ్ ఘటొకె మాహిం।
సురత్ శబ్ద్ మేలా భయా ముఖ్‌కే హొజత్ నాహిం ॥

ఆ॥ తగులు కొనక నున్న తాపత్రయంబులన్
ఆత్మమేని లోన హరిని దలచు,
జ్ఞానమబ్బి నామ స్మరణ జేసిన చాలు
వ్యర్థమైన నోటి పలుకు లేల?

తా॥ మనిషి తాపత్రయంబులలో తలమునకలై పోకుండా ఉంటే శరీరంలో అంతర్యామిగా నున్న 'ఆత్మ' ఆ భగవంతుని ప్రార్థిస్తూనే వుంటుంది. జ్ఞానంతో ఆనామ స్మరణ చేస్తే చాలు. నిరుపయోగమైన వేదాంత చర్చలు, మతబోధలు ఎందుకు? అవి ఎన్నటికీ భగవంతుని చూపలేవు.



85. సుమిరన్ సోం మన్ లాయియే, జైసె నాద్ కురంగ్।
కహకబీర్ బిసరైనహీం, ప్రాణ్ తజై తెహి సంగ్ ॥

ఆ॥ నిండు మనసుతోటి నిలుపుము హరి మదిన్
మరువ కనె కబీరు హరిని ఎపుడు,
జగతి మరచి వినును సంగీతమును 'లేడి'
ప్రాణత్యాగ మైన పారిపోదు.

తా॥ ఒకలేడి తనప్రాణాన్ని కూడ లెక్క చేయక శ్రావ్యమైన సంగీతం వింటూ నిలిచిపోతుంది. అదే విధంగా మనిషి కూడ కలుగబోయే కష్టాలకు భయపడక హృదయంలో భగవానుని మరువకుండా ప్రతిష్టించుకొని ఉండాలి. ఇది కబీరుదాసు దివ్యబోధ.



86. అంతర్‌జామి ఏక్ తుమ్, ఆతమ్ ఆధార్।
జోతుమ్ ఛోడీ హాథ్‌తో, కౌన్ ఉతారే పార్ ॥

ఆ॥ నిలిచియుందు వగుచు నీవె అంతర్యామి
ఆత్మకీవు ప్రభువు, 'ఆటపట్టు';
దయను వీడి నాదు చేయి నీవొదిలిన
ఒడ్డు జేర్చు నాధుడుర్విగలడె?

తా॥ ఓప్రభూ! నీవు ఆత్మకు అధిపతివి. అంతర్యామియైన ఆత్మరూపంలో దేహంలో నిలిచి ఉంటావు. ఆత్మకి స్థానం కూడా నీవే. నా మీద దయవీడి, నాచెయ్యి నీవు వదిలేస్తే, ఈ ప్రపంచంలో నన్ను గట్టెంకించే నాధుడెవరున్నారు? కాబట్టి నాకు నీవే దిక్కుగా రక్షించు.



87. ఉరిత్ తె కోయి న బాహురా జాసె బూఝూం।
ఇతతె సబ్‌హీ జాత్ హైం భార లదాయిలదాయి॥

ఆ॥ అచట నుండి ఎవరు అంతటి సులువుగా
తిరిగి రారు మరల త్వరిత గతిని.
'బరువు' అధిక మువును బడలిక మెండౌను
ఇచట చేరుదారి ఎరుకకాదు.

తా॥ అక్కడ నుండి (ఊర్ధ్వలోకములనుండి) ఎవ్వరూ అంత తేలికగా తొందరగా తిరిగిరాలేదు. రాలేరు కూడా ఎందుకంటే మనవెంట తీసుకుపోయిన పాపముల మూట బరువేమో చాల ఎక్కువ. మోయుటమే కష్టం అనుకుంటే తిరిగి వచ్చే దారికూడా తెలియదాయె. ఇక ఆ భగవంతుడి మీద భారం వేసి ప్రార్థించటం కంటే ఏం చేయగలం?

